గురుపరంపర తరువాత తన తాతతండ్రులను గూర్చి చెప్పి ప్రబంధ రచనో ద్యోగమును చెప్పినాడు. సత్ప్రబంధము రచింప నుద్దేశించిన సమయమున శ్రీగిరీశ్వరుడు జంగమాకృతి నేతెంచి యిట్లనును.

క. సుకవిర గ్రంథము లారును
వరను స్తవ మొకటి చెక్కు వచనంబులు ను
స్థిర శతకము తైరును శ్రీ
కర కేదారీశు నోము కథయును మరియున్.

వ. మంగళాష్టకంబులును విఘ్నేశ్వర వీరేశ్వర మల్లేశ్వర రామేశ్వరాష్ట కంబులును, శారద పదంబులును, జాజరపదంబులును నివి మొదలుగాగల కృతులును మత్కృతంబుగా భక్తమాహేశ్వరానందకరంబుగా జెప్పినాడ వప్పుడు,

క. నీకు ప్రియంబుగ నీకృతి
మా కంకితముగ నొనర్పు మది దలచితివా
మాకు ప్రియంబగు భక్తుని
కాకాంక్ష రచింపు మాకు నగును కుమారా.

సీ. బసవలింగంబు శ్రీపదపద్మమకరంద రసనుధావార్ధి మరాళ మనగ
బసవపదధ్యానభవితాంతరంగుండు బసవాంకజనిత ప్రబంధు డనగ
బసవలింగమచరజబినరుహార్చితభక్తి రసపరిపూర్ణవారాశి యనగ
బసవాదిప్రమథగణ వినుతాంచితధ్యానవశమానసద్వృత్తవర్తి యనగ
వెలయు శాసాల నగబడ్డ విమలభక్తి
పరుడు గావున తద్భక్తవరుని గురుని
కరసరోజాతజనితశ్రీకరుని సరత
పరహితౌదార్యమతుని సద్భక్త హితుని.

ఆ. వె. కలర చెప్పవలయు నమలాత్మ దలని హృ
త్కమల కర్ణికాంతరమున దాయ
కెలమినుందు మతని కీ ప్రబంధము చెప్ప
వలయు నంకితముగ వరకుమార!

ఈశ్వరుని సందేశము ననుసరించి గోపతిలింగకవి యటులే చేయదలచెను. కవికి తన తండ్రియు స్వప్నమున సాక్షాత్కరించి యటులే చేయుమనెను. కవి

కృతినిశ్చయుడై యుండగా తమ్మడిపల్లె సిద్ధయ్య యను నొక మాహేశ్వరుడు వచ్చి కృతిభర్తయగు కాసాల వరబల్ల వీరమాహేశ్వరాచార సంపదను గ్రంథ గణములను పంపించి పేర్కొనును. వానిలో మొదటి పద్య మిట్లున్నది.

సీ. మహి నభవుమూర్తి తమ్మడిపల్లె సిద్ధయ్య దేవరాదిగ జంగమావళియును
తరుణారసము చిల్కగ మమ్ము వీక్షించి వినుము గోపతి లింగ విభుతాంగ
శరణోపకారుండు శరణుండు కాసాల వరబల్ల భక్తప్రతాపు డతని
ఘనమానమగు చెన్నబసవ పౌరాణ మాపురోగ శివలింగమూర్తికి(?)

నర్పితంబుగాగ సద్గురుమూర్తికి
వెలయ వ్రాంగిలేరు వీరునకును
శివుని దేవణాను సిద్ధేశ్వరున కంకి
తముగ జెప్పవలయు నమలహృదయ.

కాసాల వరబల్ల విరుతోంధన కులజుడట. అతని తమ్ముడు గట్టుపల్లి బసవ లింగము. అతడుకూడ తనయన్నగారిని కొనియాడి చెన్నబసవపురాణమునకు కృతిపతినిగా జేయవలయునని కవిని కోరును. దీని తరువాత మాహేశ్వర పీఠిక యను శీర్షికతో వీరమాహేశ్వరప్రభావ ప్రధాన మభివర్ణింపబడినది. శివపారమ్యమును స్థాపించు నీ పీఠికలో పూర్వకవుల యొక్కయు శ్రుతిస్మృతి పురాణాదుల యొక్కయు వాక్యము లుట్టంకింపబడినవి. అథర్వణవేదము, జాబాలోపనిషత్, ముండకోపనిషత్, బ్రహ్మాండపురాణము, స్కాందపురాణము, విష్ణుపురాణము, వీరాగమము, శివాగమము, రహస్యము, ప్రభులింగలీల (తెలుగు పద్యము మరియు ద్విపదలు) చివరకు వేమన పద్యములనుండి కూడ ఉదాహరణము లున్నవి. వేమన పద్య మిది.

క. మేకలు కరుపులు ఉనగా
ప్రాకటముగ నొక్క కోతి పర్ణంబెక్కెన్
ఆ కోతి లింగభక్తము గన
కాకా యని యొక్క నక్క గూసెర వేమా.

పైపద్యము వేమన శతకకారుడగు రెడ్డివేమనదేయైనచో మన గోపతి లింగకవి వేమనకు తరువాతివా డగును.

ఈ వర్ణనములందే పురోగపట్టణాధీశ్వరుడగు శివలింగ దేశికుడును, పెదవాగి తిరుగోడుడును వారి శిష్యపరంపరయు వర్ణింపబడినారు. అట్టిపైర

కల్వగూరు (మెదకుమండలము) సీమయు, నందు సంగారెడ్డిపేటయు వర్ణింపబడినవి. కృతిభర్తయగు కాసాల వరబణ్ణ సంగారెడ్డిపేట నివాసి.

ఆతని వంశావతార మిట్లున్నది:

రేవణ్ణ (భార్య రామాయమ్మ)
|
వీరణ్ణ (భార్య నాగమాంబ)
|
వరబణ్ణ (భార్యలు పెదవీరమ్మ చినవీరమ్మలు)

ఈ వరబణ్ణయే చెన్న బసవపురాణమునకు కృతిభర్త. అతడును, అతని భార్యలును చాంగిలేరు వీరేశ్వరస్వామి భక్తులట. ఈ చాంగిలేరు సిద్ధక్షేత్ర వర్ణనము గూడ ఇందులో గలదు. అటు తరువాత తన ప్రబంధమహిమను వర్ణింపబోవుచు చెప్పిన గద్యభాగ మిట్లున్నది:

"అని శ్రద్ధాపూర్వకముగా, అభ్యుదయపరంపరాభివృద్ధిగా, ననంత జన్మభవహరంబుగా, మదీయవాక్పావనంబుగా, నగణితసుకృత ఫలదాయకంబుగా, భోగమోక్ష వరప్రదంబుగా, పురోగ శివలింగ ప్రాచార్య మాహేశ్వరాంకితంబుగా, నా యొనర్పం బూనిన సమస్త వేదాగమ పౌరాణికి పానసారంబగు, సకల భక్తమాహేశ్వర ముఖముకురంబగు శ్రీ చెన్న బసవ పురాణంబను మహాప్రబంధ ప్రారంభం బెయ్యది యనిన" —

అటుపై చెన్న బసవని మహిమలు వర్ణింపబడినవి. ఆ వర్ణనములు, మహిమలు, ఉత్సాహము, మత్తకోకిలము, తరల, మున్నగు వృత్తములందును గలవు. వీనికి పూర్వము కవి చెన్నబసవపురాణరచనమునకు తానసమర్థుడ ననియు అది మహాసాహసకార్యమనియు తన వినయమును చాటుకొన్నాడు. తాను కన్నడభాషలో నున్న చెన్నబసవపురాణము ననుసరించి దీనిని రచించినట్లు చెప్పుకొనుటచే తెలుగులో నితడే మొదటిసారిగా చెన్నబసవపురాణమును పద్యకృతిగా రచించినట్లు మనకు భావింపవలయును. అర్తలూరి పాపకవి చెన్నబసవపురాణ మీత డెరుగడన్నమాట.

తరల. అలర శివకవివరులు మును కర్ణాట భాషల నేర్పడన్
బలికి శిశ్వరభక్తివరసంపాదనీయముగా మదన్

తలప నందుల నూత్నలోనర నిదానముగ పొందించి నే
ర్పులను బిక్కటిలంగ శివకవి పుంగవుల్ ముదమందగాన్.

గీ. కలయ భవ్యన్నభావల గన్నతల్లి
తెలివి తేటతెనుంగున తెల్లమిగను
శివకవీంద్రులు నిది సుప్రసిద్ధమనగ
నవరసజ్ఞులు నిది నాకెమోసన రచింతు.

చెన్నబసవని మహిమలు వర్ణించి అటుపై శ్రీశైలాద్రి వర్ణనముతో కథాప్రారంభమునకు గడంగినాడు.

గోపతిలింగకవి విరచిత చెన్నబసవపురాణాశ్వాసాంతగద్యములిట్లున్నవి:

"ఇతి శ్రీగిరి మల్లికార్జునదేవర దివ్యశ్రీకరుణాకలిత వరప్రసాద లబ్ధ కవితావిచిత్ర పావయలింగనామార్యపుత్ర గోపతిలింగనామధేయప్రణీతంబయి సకలభక్తమాహేశ్వరనికరముఖముకురంబగు, సుకరశైవసిద్ధాంతరహస్య ప్రకరంబగు, వికసితభక్తి సుధారసపూరపారావారంబగు, ప్రకటిత శ్రీ చెన్నబసవపురాణంబను మహాప్రబంధమునందు ప్రథమాశ్వాసము."—

ఈ చెన్నబసవపురాణము ఐదాశ్వాసముల ప్రబంధము. ౧౮౮ తాటియాకులపై నున్నది.

పంచమాశ్వాసాంతమునకు పూర్వము, పురాతన నూతన శివశరణుల స్తోత్రములున్నవి. వానికి పూర్వమొక పద్య మిట్లున్నది:

క. ప్రసరించె సోమనాథుడు
బసవాదుల మహిమ చెన్నబసవపురాణం
బసల్యార ద్విపద కావ్యము
వసుమతి రచియించె భక్తవరులు నుతింపన్."

ఈ సోమనాథుని ద్విపద చెన్నబసవపురాణ మేమైనదో తెలియరాదు.

ఈ తాళపత్ర గ్రంథప్రతిని వ్రాసినవారు గోపతి లింగకవి కుమారుడే. చిట్టచివరన "తమ్మా గోపతిలింగం కొమారుడు మల్లయ్య వ్రాశిన చెన్నబసవపురాణం" అని యున్నది.

వ్రాయసకాడు ఒక కమ్మమీద ప్రథమాశ్వాసాంత గద్యము ముగించిన తరువాత నిట్లు వ్రాసికొన్నాడు.

"సురాఖాండేశ్వరం పుస్తకం పని వున్నాది యింట్లో పెద్దగూట్లె పౌతపు చంచ్చికె (సంచికి?) వున్నాదిబక్కాంతి (బక్కృవానిని) తోలించినాం అగత్యంగ పంపించేది" —

తోలించినామనునది తెలంగాణ ప్రయోగము. ఇది ప్రాచీనకాలమందును వ్యవహారమున నున్నట్లు దీనివలన తెలియుచున్నది.

ఈక గోపతిలింగకవి రెండవకృతి "అఖండజ్ఞానమనఃప్రబోధవచన కావ్యప్రబంధము" కేవలం మూడుకమ్మలపై వ్రాయబడి యసమగ్రముగా నున్నది. పీఠికగూడ పూర్తిగాలేదు. అదిలో శివస్తోత్రము, అంగడీశ్వరుడను తన గురుస్తుతియు, తలిదండ్రుల స్తుతియు పురాతనాధునాతనభక్తగణముల స్తుతియు జేసి "సకలవేదాగమశాస్త్రపౌరాణ రహస్యసారంబైన, షడ్భూతాతీతంబైన, అవాఙ్మానసగోచరంబైన, సమస్తరత్యాంతరంబైన, వీరమాహేశ్వర ప్రభావ ప్రసిద్ధసిద్ధాంతంబైన పరమశివతత్వసుధారసపారావారంబైన నిష్ప్రపంచనీరవ యనిర్గుణ నిరాకార నిత్య నిరంజానంద్య (?) మహాలింగ సంగావధానంబగు, ఖండ సద్వైద్వైరహితంబగు, నఖండజ్ఞానమనఃప్రబోధ ప్రబంధ విరచితోద్యోగ సంరంభియై" యుండగా, నొక మాహేశ్వరుడు వచ్చి దీనిని తన గురువున కంకితంబుగా నిమ్మని కోరును. కవి అందుల కియ్యకొని యా గురుస్తుతి చేయును. ఆ గురువు తోటమఠమున కధిపతియట. అతని గూర్చిన పద్యమిట్లున్నది :

సీ. తోట మఠమున నమిత సంతోషమునను
సంతతానందమయ వచ్చకాంత భగిని
మన గురుస్వామి భువి భక్తగణము సేవ
కొనుచు దిగ్దేశముల పూజ గొనుచునుండె.

అటుతరువాత కొలనుపాక సోమేశ్వరస్వామి వర్ణనము గలదు. కొలనుపాక వర్ణనముగల పద్యములతో నీ గ్రంథ మసమగ్రముగా ముగిసినది. ఆ పద్యము లందొకటి రెండు —

మ. అమరుల్ పాదపముల్ ఖగంబులును నిత్యానందసింధుల్ పురిన్
అమరున్ గోవులు కామధేనువులు పుణ్యక్షేత్ర సద్వర్ణనం
బనురేంద్రాళ్ల శివాచ్యుతాదుల కకక్యం బన్నపూర్ణాంబికా
భ్రమరాధీశునకున్ సుఖావహము సౌభ్రాత్రైక తత్పరమున్."

చ. కమలహితుండు తారలును గాలి సుధాకరుడున్ గ్రహంబులున్
అమరులు తాపసేంద్రులు మహోదయమంద పురంబు చుట్టునన్
గమిగొని భైరవుల్ ప్రహరి గాచుచు దా విహరింపుచుందు ర
క్కసముల విరోధినౌ వరకంటకములున్ మదిలో దలంపుచున్."

(ఈ కవి వితరములగు రక్కిన కృతు లేమైపోయినవో తెలియదు.

(ఉదయభాను, జనవరి 1962)

# నేబతి కృష్ణయామాత్యుడు

గోలుకొండ నగరిలో పుట్టి సుమారు నాలుగు వందలేండ్లుగా మరుగున పడియుండి ఇన్నాళ్ళకు కన్నులు తిరిగేలు మెరిపించిన కవివరహీరము నేబతి కృష్ణయామాత్యుడు. అతడు కేవలము కవివరుడే కాడు, అమాత్యశబ్దమాతని యెడ సార్థకము. కవియై, కవిపోషకుడై, మంత్రియై, మహమ్మదీయ సుల్తానుల సభాలంకారమై, భగవద్భాగవత కైంకర్యధురీణుడై విరాజిల్లిన నేబతి కృష్ణమంత్రి చరిత్ర ఇన్నాళ్ళు మరుగున పడియుండుట విధివిలాసము. కృష్ణమంత్రి తండ్రి కమలయామాత్యుడు, తల్లి కొండాంబ. వీరిది కౌండిన్యస గోత్రము. గోలుకొండకు సమీపమున గల సిద్ధలూరు జన్మస్థలము. సిద్ధలూరునకు సమీపమున గల అనంతగిరిలో వెలసిన శ్రీ నరసింహస్వామి యిలువేలుపు. మహమ్మదుషాహి అని తెలుగు కవులు పేర్కొను మహమ్మదు ఖులీ ఖుతుబ్షా (1580-1612) ప్రధానమండలిలో నొకడై, అతని యాస్థాన కవులందుగూడ నొకడై, మిత్రుడై "రాజనీతి రత్నాకర" మను నాలుగాశ్వాసముల కావ్యమును వ్రాసినవాడీ కృష్ణయామాత్యుడు.[1]

'రాజనీతి రత్నాకరము' ౧౪౨ తాటాకుల గ్రంథము. ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయము సంస్కృత అకాడమీ లిఖితపుస్తక భాండాగారమందున్నది. దీనిని తొలుత కనుగొన్నవారు క్రీ. శే. కురుగంటి సీతారామయ్యగారు.[2] పరిష్కరించు తలంపుతో నెత్తి వ్రాసికొన్నవారు శ్రీ కౌతా రామకృష్ణశాస్త్రిగారు. నేబతి కృష్ణయామాత్యుడు పంచతంత్రమును ఆంధ్రత్వముద్రలో వైష్ణవప్రబంధముగా దిద్ది తీర్చి 'రాజనీతి రత్నాకరము'ను వెలయించినాడు.

రాజనీతిరత్నాకరము పీఠిక మిక్కిలి విలువైనది. సమకాలీన రాజకీయ చరిత్రముతోపాటు సమకాలీన సాహిత్యచరిత్రమును గూడ రాజనీతిరత్నాకర పీఠిక మన కందించుచున్నది. గురుస్తుతి సందర్భమున గల పద్యమువలన

---

1. వివరములకై చూడుడు. "ఖుతుబ్షాహీ సుల్తానులు-ఆంధ్రసంస్కృతి" పుటలు 97-112 ప్రచురణ : ఇదారా-అదబియాతె-ఉర్దూ. 1962.

2. చూడుడు. ఆంధ్రభాగవతోపన్యాసములు. పుటలు 21-22. ఆంధ్ర సారస్వత పరిషత్తు. 1957.

కృష్ణమంత్రి గురువు కందాళ రంగాచార్యులని తెలియుచున్నది. అటు తరువాత పద్యములో కందాళ అప్పగారు స్మరింపబడినారు. ఈ కందాళ అప్పగారును వైజయంతీ విలాసకర్తయగు సారంగు తమ్మయగురువగు కందాళ అప్పగారును ఒక్కరై యుందురు. సమకాలీనులగు ఆచారపురుషులను స్మరించుపట్ల కృష్ణయామాత్యుడు అష్టభాషాకవిత్వవిద్యాధురీణుడును, పరాశరభట్టరాన్వయకులాబ్ధిచంద్రుడును, ముడుంబ సింగరాచార్యతనయుడునగు, శ్రీ సాధుభట్టరాచార్యులను స్మరించినాడు. ఇంతవరకు చరిత్రమున కెక్కని మరియొక మహాకవిని గూడ కృష్ణమంత్రి పరిచయము చేసియున్నాడు. ఆ మహాకవి మరింగంటి వెంకట జగన్నాథాచార్యుడు. అతడు గురుమూర్ధన్యుడట. శతవధాన విశదాంకుడట. ద్రావిడామ్నాయ తత్త్వరసజ్ఞుడట. సంస్కృతాంధ్ర రచనాదక్షుడట. హయాధీశకంధరసంలబ్ధసువర్ణవృష్టియుతుడట, కర్ణాటక్షమాభృత్సభాంతరపూజ్యుడట. ఇంతటి మహాకవి కృతులేమైపోయినవో తెలియదు. మరింగంటి వెంకట జగన్నాథాచార్యుల తరువాత ఆంధ్రభాషానిరోష్ఠ్య మహాప్రబంధరాజరచనాధురీణుడును, కర్ణాటరాయలబ్ధ కవిసార్వభౌమ కల్యాణబిరుదశాలియునగు మరింగంటి సింగరాచార్యులను స్మరించినాడు. ఈ మరింగంటి సింగరాచార్యులు చరిత్రమున కెక్కిన మహాకవి. వింశతి ప్రబంధనిర్మాత. దశరథరాజనందన చరిత్రము. నిరోష్ఠ్య సీతాకల్యాణము మున్నగు నీతని రచనము లాంధ్రసారస్వతలోకమున కిదివరకే పరిచితములు. కృష్ణమంత్రి కూడ సామాన్యకవి కాడు; తన కవితాపైతృకవాదుల నీతడు తన గురువుకోట నీవిధముగా వర్ణించి యున్నారు—

సీ. స్వర్ధునీవీచికాసంఘాతఘుమఘుమ న్నిర్ఘోషముల మించి నీటు గెలిచి
వాన్యామినీపాదపవనజాత కాంచనాంగద ఝుళంఝుళరావగతుల దెగడి
నిర్జరద్రుమజాలనిస్సరన్మకరంద ధమధమన్నాద సంతతుల గేరి
కాంచీనిరంతరనీకాంచీలతాఘంటికా ఘణంఘణరవప్రక్రమము మించి
గీ. వెలసె భవదీయనవసూక్తి విరచితానవద్యగద్య సుపద్య కావ్యప్రబంధ
దండకోదాహరణకవితానిగుంభనములు కృష్ణప్రధానసంప్రదాయపరతంత్ర. 1-33

చ. వరుసవు తొండుమల్లియల బంతులొకో యన జాజులోయనన్
విరివిరవాదిపువ్వులన వెన్నెలలో కుముదంబులోయనన్
సరసిజకర్ణికాకృతుల చల్లనిదావుల పిక్కటిల్లుచున్
సెరసె భవత్కవిత్వములు నేలటి కృష్ణకవీశ్వరా! 1-34

క. కోనమదేవీవల్లభ గానకళాలోల సకలకవిబాంధవ ర
క్షానిధి వైష్ణవకల్పక ధీనిధి కమలేంద్రు నేలటిప్రభు కృష్ణా! 1-85

గీ. సరస చౌరాసిదుర్గరక్షాధురీణుడైన మహమదుశాహుసుల్తాను కీవు
గలప్రధానివిహితుడవు కవివరుడవు ధీర! శ్రీకృష్ణ కొండమాంబాసుపుత్ర! 1-38

పైవానిలో 83, 84 పద్యములవలన కృష్ణమంత్రి కవిత్వపటుత్వమును, 85వ పద్యమువలన కృష్ణమంత్రి భార్యపేరు కోనమ యనియు, అతడు గానకళాలోలుడనియు, సకలకవిబాంధవ రక్షానిధియనియు, వైష్ణవకల్పకుండనియు, ధీనిధియనియు, తండ్రి కమలేంద్రుడనియు తెలియుచున్నది. 38వ పద్యము రాజకీయ, సాహిత్య చరిత్రములకు మిక్కిలి ముఖ్యమైనది. చతుర్థపాదమున కృష్ణమంత్రి జనని కొండమాంబ పేర్కొనబడినది.

కృష్ణమంత్రి 84 దుర్గముల నేలికయగు మహమదుశాహు సుల్తానునకు ప్రధాని, హితుడు, మరియు కవివరుడట. మహమ్మదుశాహుసుల్తాను ఆంధ్రవాఙ్మయమున కీవరకే పరిచితుడు. సారంగు తమ్మయ తన వైజయంతీ విలాసమున నీ మహమ్మదు శాహినే 'ఎనుబదినాల్గు దుర్గముల నేలిన యేలిక'గా వర్ణించియున్నారు. కీ. శే. కందుకూరి వీరేశలింగంపంతులుగారును మరియు కీ. శే. చాగంటి శేషయ్యగారును సారంగు తమ్మయ కాలమును గూర్చియు, మహమ్మదు శాహును గూర్చియు భిన్నాభిప్రాయములను ప్రకటించియున్నారు. అన్నాళ్ళ సమస్య సుపరిష్కృతము గాకయుండెను. నేలటి కృష్ణమంత్రివలన అన్నాళ్ళకీ చిక్కుసమస్య శాశ్వతముగా పరిష్కరింపబడినది. మహమ్మదుషా అనునది ఖుతుబ్షాహీ సుల్తానులందైదవవాడైన మహమ్మదు ఖులీఖుతుబ్షాకు (1580-1612) తెలుగువారు పెట్టిన పేరని తెలియుచున్నది. ఏలన నేలటి కృష్ణమంత్రి కొలిచినది మహమ్మదు శాహిసుల్తానును. కృష్ణమంత్రి తండ్రి కొలిచినది ఇబ్రాహీం ఖులీఖుతుబ్షాను. తండ్రి కొడుకులు కొలిచినది మరల తండ్రికొడుకులగు సుల్తానులే కావలయును గదా. ఇబ్రాహీం ఖులీఖుతుబ్షాను ఆంధ్రవాఙ్మయమున మలికిభరాముడనియు ఇభరాముడనియు అందురు.

తనతండ్రియగు కమలప్రధానిని వర్ణించుచు నేలటి కృష్ణమంత్రి చెప్పిన పద్యమిట్లున్నది.

సీ. మలికిభరామక్ష్మానాథ చంద్రుండు మెచ్చగా సత్కీర్తి హెచ్చినాడు
పానుగంటివర పట్టణాధ్యక్షుడై మించుగా ప్రజల పోషించినాడు

వసుధ నేకాదశీ వల్లభుడై ద్వాదశీ చూరకారుడై వెలగినాడు
కలనైన బొంకెరుంగక సత్యవాక్య ప్రతిష్ఠచే సిరుల వర్ధిల్లినాడు
సరస సంగీత మహిమల వరకవిత్వ లీల నాదిమసుకవుల బోలినాడు
తెలియ సచివేంద్ర మాత్రుడే యలఘు విభవధారి నేబది కమల ప్రధాన శౌరి.

కనుక కమలమంత్రి కొలిచిన మలికభరాము ఉమానాథ చంద్రుని కుమారుడును, కృష్ణమంత్రిచే కొలువబడిన మహమ్మదుశాహు సుల్తానును, మహమ్మదు కులీ ఖుతుబ్షాయే కావలెను. మరియు సారంగు తమ్మయవలెనే కృష్ణమంత్రియు మహమ్మదు శాహిని 84 దుర్గముల కధిపతిగా వర్ణించినాడు. ఆ 84 దుర్గము లెవ్వియో చారిత్రకులు తేల్పవలెను. పై పద్యములో కమలమంత్రికున్న ఏకాదశీవల్లభ, ద్వాదశీచూరకా యను రెండు బిరుదముల యర్థము నాకు తెలియరాలేదు. ఇవి యాతని విశిష్టాద్వైతమతసంప్రదాయమునకు చెందినవో యేమో తెలియదు. కృష్ణమంత్రి సప్తపురుషాంతరములనుండి తన వంశావతారమును దానిలోని శాఖోపశాఖలను విపులముగా వర్ణించియున్నాడు. ఇతర శాఖలను విడిచి కేవలము కృష్ణమంత్రి పూర్వుల క్రమ మిట్లుండును.



పై వంశావతారమున రెండవ తరమునకు చెందిన నాగరాజు బెదంద కోట సులుతాను శహా సముఖమున నేలటివని యుద్ధరించినవాడట. అప్పటి నుండియు తమ ఇంటిపేరు నేలటివా రైనట్లు కవి చెప్పియున్నాడు. నాగరాజు అశ్వపతి సులుతాని రక్షణధురంధరుడై వెలసిల్లెనట. నేలటి యనునది నియాబత్ అను పదమునకు తెలుగు రూపము. నియాబత్ పదమునకు రాయబారి యనియు స్థానాపతి యనియు రెండర్థములు కలవు. నాగరాజు బహ్మనీ సుల్తానుల స్థానాపతియై యుండునని నా యూహ. ఈ విధముగా కృష్ణయామాత్యుని యమాత్యపదవి వరుమంత్రపు సిరి కాదనియు, ఆరేడు పురుషాంతరములనుండి యాతని పూర్వులు రాజకీయముగా గొప్ప పదవు లలంకరించిన వారనియు తెలియుచున్నది. తండ్రియగు కమలమంత్రి పానుగంటి పట్టణాధ్యక్షుడట. అనగా పానుగల్లు దుర్గాధిపతి యని యర్థము కాలోలు. తన తండ్రి సిద్ధలూరులో సప్తసంతానప్రతిష్ఠ యొనర్చినట్లు వర్ణించియున్నాడు. తమ్ముడగు నరస మంత్రియు "చెలిమి మహమ్మదు శాహు సులాను సముఖమున ఆనులెన్న బొరలినాడు" బమ్మెర పోతనార్యుడు మత్కులవరేణ్యుడనియును స్మరించినాడు. పీఠికాగతములగు నితరవిషయము లన్నియు విస్తరభీతిచే విడిచి, కేవలము ముఖ్యమైన వానినే పేర్కొంటిని.

నేలటి కృష్ణయామాత్యుడు విశిష్టాద్వైత సంప్రదాయమునకు చెందిన నియోగి. కనుక రాజనీతిరత్నాకరమును గూడ ఆ సంప్రదాయము ప్రకారముగనే దిద్ది తీర్చినాడు. మొదటి పద్యమున శ్రీ మహావిష్ణువును, రెండవ పద్యమున శ్రీ మహాలక్ష్మిని, మూడు నాలుగు పద్యములందు అనంత గరుడ విష్వక్సేనాదులను మరియు పూర్వాచార్యులను స్మరించినాడు. రాజనీతి రత్నాకరము కృష్ణమంత్రి తన ఇలువేలుపగు అనంతగిరి శ్రీ నరసింహున కంకితముగా రచించెను. పీఠికలో నీ యనంతగిరి నరసింహస్వామి సన్నిధిని మోహనాంగులు నెరపు సేవావిధానంబు శృంగార తరంగ సంగీత విద్యావధానంబుల పెక్కురీతులను వర్ణించియున్నాడు. చివరన షష్ఠ్యంతములు చెప్పి కథాప్రారంభమునకు గడగినాడు.

కృష్ణ మంత్రికి తనకన్న సుమారు నూరేండ్లు ముందుగా మూలగుంట నారాయణ కవి రచించిన పంచతంత్రము తెలియనట్లున్నది. ఏలన పీఠికలో కవి,

గీ. ధీరతఁ దొల్లిటి కవులు ప్రబంధ కర్తలయ్యు నీ రాజనీతి రత్నాకరంబు
సేయకుండిరె(రు?)నన్ను నేఁ జేయుమనుచు కృతికలనసి కృతులర వింపగలిగెగాక

యని చెప్పియున్నాడు. ఈ పద్యమునకు ముందున్న పద్య మిట్లున్నది.

క. వరరాజనీతి రత్నాకర మీకృతి, చరిత విష్ణుకథ, నాథుడు శ్రీ
వరసంపూర్ణుడట ధీ బంగరువునకున్ బరిమళంబు గలుగుటగాదే.

దీనివలన కృష్ణమంత్రి దీనిని వైష్ణవప్రబంధముగా రచించినాడని తెలియును. కనుకనే శ్రీరంగము వర్ణనముతో కావ్య మారంభమైనది.

కథాప్రారంభమునఁగల పద్యమిది.

గీ. ఇందిరాసుందరి కేళిమందిరంబు, నిజవసీ సౌరభాగతేందిందిరంబు
ధరణీ కాంతావరాబ్జనూపురము దనరు, రమ్యపథవాకరంబు శ్రీరంగపురము.

శ్రీరంగపుర మీ విధముగా నిరువది గద్యపద్యములందు ప్రబంధోచితముగా వర్ణింపబడినది. పురవర్ణనము, చాతుర్వర్ణ్య వర్ణనము, చతురంగబలముల వర్ణనము, వారవిలాసినుల వర్ణనము లన్నియు ప్రౌఢముగా శబ్దాలంకారమయములుగా నున్నవి. శ్రీరంగనగరము చుట్టునున్న యగడ్తను వర్ణించు పద్యమిది.

సీ. ఉబ్బు సొక్కులనొంద నొడ్డలో రాహువు జడలిప్తఁ జెప్పుడు డుడుకుటోరు
రమ్ములవగవాని తంద్రి రత్నసిమూక కడుపులో నడుకొన్న కలకదారి
ప్రుద్ధ్యమనుండు కోతుల కెట్టుబట్టువా ధరివిసపాద కొండాటకాడు
వచ్చినవారిచే వడుసుళ్ళలరి మొరవెట్టు నూరక చుట్టిచుట్టి తిరుగు
నలనముద్రుండు నాకునీడగు నెయనుచు, తన తరంగఘుమంఘుమికార వ్యాట్ట
హాసములచే గయాళించునట్ల దనరు, నగరిరన్ప్రాక్తి నమ్మహానగరిపరిఖ.

ఈ సందర్భముననే శ్రీరంగమందలి వారకాంతలను వర్ణించిన సీసపద్యము తరువాత నచటి యౌవనాంగుల బొంగరములాట నీ విధముగా వర్ణించినాడు.

కం. బంగరు బొంగరముల నృపపుంగవు నతులదర నఖులః బుచ్చుకొని వడిన్
ధింగురని మోయ సౌధప్రాంగణముల యౌవనాంగు లాడుదు రెపుడున్.

శ్రీరంగపురవర్ణనమైన పిమ్మట తదధిపుడగు సుదర్శన చక్రవర్తి వర్ణనము నాల్గు పద్యములందున్నది. సుదర్శనుడు వైష్ణవుడుగా చిత్రింపబడినాడు.

అతని యాస్థాన వర్ణనము కడుదీర్ఘముగా సాగినది. అదియు పదునారవ శతాబ్దపు దర్బారుల వర్ణనము వలె నున్నది. విష్ణుశర్మ సభాప్రవేశ మొనర్చిన సమయమున సుదర్శన చక్రవర్తి "తనరంగ శ్రీమద్రామాయణ మహాకావ్యంబు నకు ననేకార్థంబు పుట్టి కర్ణపర్వంబుగా శ్రీ వైష్ణవస్వాములు వినుపింప సంతోషించు" చుండెను. సుదర్శనుడు విష్ణుశర్మకు తన కుమారుల నప్పగింప నాతడు "రాకుమారులారా వినుండు। మిత్రభేదంబన, సుహృల్లాభంబన, సంధి విగ్రహంబన, లబ్ధనాశంబన, అసంప్రేక్ష్యకారిత్వంబన బరగునివి పంచ తంత్రంబులు, అందు ప్రథమతంత్రంబగు మిత్రభేదం బన్నది యెఱింగించెద" అని కథలు చెప్పుట ప్రారంభించును.

మిత్రభేద మెఱింగించుపట్ల ప్రారంభమున కాంచీపురము వర్ణనము శ్రీ వరదరాజస్వామి వర్ణనము గలవు. అచ్చటి బేహారి విష్ణువర్ధనుడు వరద రాజస్వామికి గోపుర ప్రాకారమంటపంబు లనేకంబులు గట్టి పరమభాగవత కైంకర్యధుర్యుడైనవాడుగా వర్ణింపబడినాడు. అతడు నందకసంజీవకాహ్వ యములు గల వృషభములను బూన్చిన బండిపై బేహారమునకు బయలు దేరును. అతడు కొన్నాళ్ళు ప్రయాణముచేసి వెంకటనామశైల ప్రాంతమునకు వచ్చెను. అప్పుడు విష్ణువర్ధనుడు

గీ. కాంచిమాకాంచికాపురి కంటె బాగు, కన్నులపండువై యున్న దెన్నగనుచు
దిగువతిరుపతి యందు మాళిగలవిడిచి, నచట కొందఱనునిచిరానకులక క్రి.

ఆళ్వారుతీర్థమున స్నానమాడి తిరుమణి తిరుచూర్ణములు ధరించి పన్నిద్ద రాళ్వారుల ప్రస్తుతించి గోవిందరాజుల గొలిచి చూడుకొడుత్తనాచ్చియారుకు వందనము చేసి, అలిపిరి గోపురము కడచి, ఆయా విగ్రహముల నభినుతించి స్వామి పుష్కరిణిలో స్నానమాడి నీరదిరుగని చింతను వర్ణించి గరుడస్తంభ మునకు ప్రదక్షిణ మొనర్చి అటుపై వెంకటేశ్వరస్వామిని దర్శించి బహుద్రవ్య మర్పించును. వెంకటేశ్వరస్వామి విష్ణువర్ధనుని భక్తికి మెచ్చి కన్నుల పొడకట్టి "నీవు దెచ్చిన సంజీవక వృషభంబుల నాకు సమర్పించరా" యని కోరును. విష్ణువర్ధనుడు సంజీవకమును స్వామికి సమర్పించి దిగువతిరుపతిలో బేరము చేయుచుండును. ఇది యిట్లుండ సంజీవకుని వర్ణనము.

క. దినదినము నరవపిక్కలు, వనువరగా నానవాల పానెపుముద్దల్
దినుపింప వృషభ మెచ్చెన్, మినమినమని మేనిచాయ మించులు జూపగ

సీ. కోనేటి తీర్థంబు గ్రోలి వచ్చుటలచే వెంకటేశముఖాబ్జ వీక్షణమున
సతత వైష్ణవదివ్యసల్లాపకథలచే ద్రవిడప్రబంధార్థతతులచేత
శ్రీ భాగవతభుక్తశేషంబు గొనుటచే సజ్జనోత్తమ వికస్వర్యనమున
కల్యాణరామసంగతి జరించుటచే వివిధపుణ్యాశ్రమ విహరణముల
గాంచెను జ్ఞానవిభవంబు గాంచె యుక్తి, గాంచె రామాయణాదిభాగవతపురాణ?
వేదవేదాంతశాస్త్రార్థవిశదబుద్ధి, ధీర సంజీవకుడు కళాప్రౌఢిమమున.

ఈ విధముగా పంచతంత్రముపై వైష్ణవముద్రయు మరియు నాంధ్రధర్మ ముద్రయు నొత్తి రాజనీతిరత్నాకరమును వెలయించినాడీ గోలకొండ నియోగి మంత్రి.

నేలటి కృష్ణమంత్రి తన యాశ్వాసాంతగద్యములం దాయా యాశ్వాసములందలి విషయమును క్లుప్తముగా నిచ్చియున్నాడు. ఆ శ్వాసాంతగద్యము లీ తీరుగా నున్నవి :

I ఇది శ్రీ మదనంతసంతత కృపాకటాక్షసంప్రాప్త సరసవిద్యానిధాన రామానుజాచార్యకథానుసంధానమానస కౌండిన్యగోత్రపవిత్ర నేలటి కమలేంద్రు పుత్ర పరమభాగవతకైంకర్యధుర్య కృష్ణయామాత్య ప్రణీతంబైన రాజనీతిరత్నాకరంబున మిత్రభేదంబునందు పురవర్ణనయును, రాజవర్ణనయును, రాజాస్థాన శృంగార వర్ణనయు, కాంచిరా వెంకటప్రభావంబును, కరటక దమనక సంహారంబును, స్తంభవివరంబున మర్కటంబు చిక్కి చచ్చుటయు, జంబుకంబు వెరపు దీరుటయును, పింగళకసంజీవక మైత్రి గలుగుటయు నన్నది ప్రథమాశ్వాసము.

II ఇది శ్రీ......రాజనీతిరత్నాకరంబునందు మిత్రభేదంబున సంజీవకుం డొనర్చు పారుపత్తెంబునకు దమనకుండు విరోధించుటయును, మేష యుద్ధంబుచే జంబుకంబు గెడయుటయును, ఆషాఢభూతిగాడను వాడు పాతెపుడుక విశ్వాసంబు చూపి కురువసొమ్మపహరించుటయు, వాయస కాకోదరోపాఖ్యానంబును, శశకం బుపాయాంతరంబుచే కంఠీరవంబును బరగొట్టుటయును, దమనకుండు పింగళకు నొద్దకు కొండెంబు చెప్ప వచ్చుటయు నన్నది ద్వితీయాశ్వాసము.

III ఇది శ్రీ......రాజనీతిరత్నాకరంబను మహాప్రబంధంబునందు మిత్రభేదంబను ప్రథమతంత్రంబున దమనక పింగళక నీతివిచారంబును, డిండిభుండు వచ్చుటచే మంత్రివిసర్జింపి గెడయుటయును, దమనక సంజీవక సయవివాదంబును, సింహంబు లోటిపెటను నమ్మించి ద్రోహంబు సేయుటయు, టిట్టిభటిట్టిభీ సంవాదంబును, కూర్మంబు యష్టి విడిచి పెట్టుటయు, అనాగతవిధాతయు నుత్పన్నమతియును భవిష్యంతును, మత్స్యత్రయవిచారంబును, గోపికాంగన జారద్వయంబు మోసపుచ్చుటయు, క్షీరాబ్ధివర్ణనయు, శ్వేతద్వీపవర్ణనంబును, శ్రీమన్నారాయణుండు గరుడవాహనారూఢుండై టిట్టిభకి ప్రసన్నుండై సముద్రుని చేత గ్రుడ్లు నిప్పించుటయు, దమనకుండు సంజీవకునితో యుద్ధక్రమంబు చెప్పుటయు, మర్కటంబునకు (సూ)చిముఖదను పక్షి బుద్ధిచెప్పబోయి గెడయుటయు, సుబుద్ధి దుర్బుద్ధి సం(వాదం)బును, బకడింభకుల నొకముంగిస రక్షించుటయును, లోహార్థంబు ఇద్దరు కొట్లు పోరి తగవున దె(గుట)యును, సంజీవక పింగళకులు పోర శ్రీ వెంకటేశ్వరుండు ప్రసన్నుండై సంజీవకుని రక్షించుటయు నన్నది తృతీయాశ్వాసము.

IV ఇది శ్రీ......రాజనీతిరత్నాకరంబను మహాప్రబంధంబునందు సుహృల్లాభంబను ద్వితీయతంత్రంబున లఘుపతనకుండు రాగా గని కాల్మలి... పై నిల్చుటయును, జాలరివాడు వచ్చి క్రింద వలయొడ్డిన చిత్రగ్రీవాది కపోతంబులు వచ్చి చిక్కుబడుటయును, అవి భీతిల్లి వాని నెత్తుకొని యెగసి చని హిరణ్యకునిచే బంధనంబులు విడిపించుకొనుటయు, వాయసమూషక స్నేహంబును, మంథరంబు మూషకంబుతో నిష్ఠమైత్రి గావించుటయును, మూషకంబు తన పూర్వ వృత్తాంతంబు చెప్పుటయును, సారంగంబు వచ్చి మంథరాదులతోడ సఖిత్వంబొనర్చుటయును, వేటకాని యురుల హరిణంబు దగులుపడుటయు, నెమకి వచ్చిన యెలుకకు తొల్లిటి నిర్బంధంబు చెప్పుటయు, చెంచువాడు చనుదెంచుచో నవియు దొరకకుండిన కూర్మంబును బట్టుకొనుటయు, నా మువ్వురు నుపాయంబున కమఠంబును సాధించుటయు, నలువురు గూడి సంతోషచిత్తులై శ్రీరంగ దివ్యభూషణుల స్థ(లం)బొనర్చుకొని యుండుటయు నన్నది చతుర్థాశ్వాసము.

V ఇది శ్రీ......రాజనీతిరత్నాకరంబను మహాప్రబంధంబునందు మేఘవర్ణుం డరిందమునిచేత దరుముడువడి పోవుటయు, సకలపక్షులు గూబ యొకగూబను పట్టంబు గట్టగా నొక వృద్ధవాయసంబు వచ్చి విఘ్నంబు సేయుటయు, వ్యపదేశంబుచేత శశకంబు గజంబుల బోగొట్టుటయు, శశక పింజలుల యన్యోన్య వాదంబులచే మార్జాలంబు గెలయుటయు, బ్రాహ్మణుండు ధూర్తులచేత వంచింపంబడి ఆయ్యజంబు విడిచిపెట్టుటయు, యజ్ఞపశు పదార్థంబు భక్షించి విఘ్నంబు సేయుటయు, రథకారుని భార్య యన్యపురుషుని గూడి ప్రియుని సంతోషపెట్టుటయు, గౌతమ ప్రభావంబున మూషికి కన్యయై మునుపటి రూపంబు గైకొనుటయు, కపటోపాయమైత్రిచే చిరంజీవి గద్గదస్వరంబున శరణొందిన నా యరిందము ముందు తన ప్రధానులతో విచారంబు గావించుటయు, స్వర్ణదాయుండను వైశ్యుండు చోరున కుపకారంబు సేయుటయు, ఒక్క బ్రాహ్మణునకు చోరరాక్షసులు హితవు చెప్పుటయు, రథకారుండు తన భార్య విటునిం గలయుంజూచి క్రోధంబు మాని ఆయువతి వాక్యంబులకు సంతసించుటయు, అరిందమాదుల గిరిప్రదేశంబుల నుంచి చిరంజీవి మేఘవర్ణునింగూడి అరిందము మునీంద్ర తత్ప్రధానిపంచకంబుల నిర్జించుటయు, కృష్ణసర్పంబు జాలపాదాదిమండూకంబుల భక్షించుటయు, తత్ప్రధానివలన వాయసాధీశ్వరుండు నిశ్చింతుండై పుత్రమిత్రకళత్రసహితులతో గూడి రాజ్యంబు సేయుచు సుఖం బనుభవించుచున్నది సంధివిగ్రహంబను తృతీయతంత్రంబు పంచమాశ్వాసము.

VI ఇది శ్రీ...—రాజనీతిరత్నాకరంబను మహాప్రబంధమునందు చతుర్థతంత్రంబను లబ్ధనాశనంబున బలివదనుండు శింశుమారునితో సఖ్యంబు గావించుటయు, అతండు కపటోపాయంబు దలంచికొని ఉదుంబరవృక్షంబు కపీంద్రుండెక్కుటయు. దానికి జంబుకంబు (　　　) మృగేంద్రునకు లోనయ్యెనను వృత్తాంతంబు చెప్పుటయు, నన్ని చతుర్థతంత్రంబున లబ్ధనాశంబయ్యె. నటమీద నసంప్రేక్ష్యకారిత్వంబుగల పంచమతంత్రంబున నొక బ్రాహ్మణుండు తన కులాంగనకు మంచి కుమారునిం బుట్టించెద ననుటయు, ఆసాధ్వి అనాగతచింత వలవదని విద్యాభ్యాసియను భూసురుని కథ చెప్పుటయు, అతండు భార్యవలన కుమారునిం గనుటయు, కులాంగన

పెనిమిటివద్ద కుమారుని నుంచి అలంబులకుం బోవుటయు, తిరుగవచ్చు లోన వారు సాహసంబున నకులంబును గెలవుటయు, అతండుభార్యవలన నాపితుండు నిక్షేపార్థంబుజేసిన విధంబెరింగించుటయు నన్నది ఉభయ తంత్రంబులు సర్వంబును షష్ఠమాశ్వాసము"—

చివర కమ్మపై (౧౪౬) ఈ తాళపత్రప్రతి వ్రాసిన తిథివారాదులున్నవి. ంబి సంవత్సర మార్గశిర బహుళపంచమి గురువారమునాడు లోనాల అప్పన్న మారుడు వెంకటాద్రి యీ ప్రతిని వ్రాసికొన్నట్లు గలదు. ఇది 6-12-1838 తేదీ సరిపోవుచున్నది.

అరిగెడు దిక్కులేక తెలంగాణమందు పుట్టిన కృతు లిట్టి వెన్ని నశించి యినవో మరి యెన్ని మూలమూలల నడగియున్నవో తెలియరాదు నేటి లమున నీ తాటియాకుల గౌరవ మేరికిని పట్టరాక వెట్టికి పుట్టిన బిడ్డవలె న్నది.

(ఉదయభాను, ఫిబ్రవరి 1962)

# పరశురామపంతుల లింగమూర్తి

## రెండు వేదాంత శతకములు

తెలుగు వాఙ్మయమున శతకములకున్న ప్రాముఖ్యమును వాని వైవిధ్యమును సాహిత్యజ్ఞు లెరుగుదురు. శతకవాఙ్మయమున వేదాంతశతకముల దొక యుపశాఖ. ఇటీవల రెండు అముద్రిత వేదాంతశతకములు నా కంటబడినవి. ఇవి యిన్నాళ్లట్లు మూలబడియుండుటకు కారణ మేమో నాకు తెలియరాదయ్యెను. రచయిత ఏ యనామకుడో యనుకొందమన్న నటులగాదు. తెలుగు వేదాంతవాఙ్మయము ప్రసక్తి వచ్చినంతనే పేరుకెత్తి మ్రొక్కవలసిన మహానుభావుడా రచయిత. మరి యీ శతకములకీ దుర్గతి యెట్లు పట్టెనో నా వంటి యల్పజ్ఞాన కూహకందని విషయము. పరశురామపంతుల లింగమూర్తి గారి పేరు విననివారుందరు కదా! ఆయన రచించిన సీతారామాంజనేయమును గూర్చి తెలియని సాహిత్యజ్ఞులుందరు కదా! అంతటి మహాయోగి-తారకబ్రహ్మ-రచించిన ఈ శతకములు మూలబడి యుండుటేకాదు. వాని పేరులు కూడ సాహిత్యచరిత్రమున కెక్కలేదు. సీతారామాంజనేయమునకు పీఠికను సంతరించిన శ్రీ. శే. శేషాద్రిరమణకవులు పరశురామ పంతుల లింగమూర్తి గారి కృతులారింటిని పేర్కొన్నారు. ఆ యారింటిలో నీ శతకములు లేవు. ఈ ఆరింటిలో నొకటియగు మానసశతకమే శ్రీ. శే. వంగూరి సుబ్బారావుగారు పేర్కొన్న మనశ్శతకము. నా కంటబడిన ఈ రెండు శతకములు ఆత్మారామ, గోవింద శతకములు. నాకు ఆత ఈ శతకములు లింగమూర్తి యోగి కరవలి రచనములని తోచుచున్నది.

పరశురామపంతుల, శ్యామపంతుల మున్నగు నియోగులు తొలుత మహారాష్ట్రులనియు, ఓరుగల్లు మండలమునకు వలస వచ్చి యట స్థిరపడి పోయిరనియు ప్రాతతరములవారు చెప్పగా వింటిని. పరశురామపంతుల

వారు అంబాల, ఈదులవాయి, మట్టెవాడ మున్నగు ప్రాంతము లందున్నారు. లింగమూర్తి పదునెనిమిదవ శతాబ్దమున నున్నవారు. అతని సీతారామాంజనేయము క్రి. శ. 1780 ప్రాంతములందు రచింపబడియుండునని కీ. శే. శేషాద్రిరమణకవు లూహించియున్నారు. వారు లింగమూర్తి రచనములని పేర్కొన్న 1. రతిమన్మథ విలాసము 2. జీవన్ముక్తి ప్రకరణము 3. బ్రహ్మనారద సంవాదము 4. తారకయోగము 5. మానస శతకము (కందములు) 6. సీతారామాంజనేయము కాక తరువాత కాలమున బయలుపడి అచ్చైనది 'సీతపాట'యను నృత్యగేయ కావ్యమొకటి కలదు.[1] లింగమూర్తి గొప్ప వేదాంతవేత్త మరియు మహాభక్తుడు. పోతన్న గోపన్నలవంటి మహానుభావుల వెన్నుదన్ని పుట్టిన లింగమూర్తి భక్తివైరాగ్యముల కూడలి. అతని జన్మ చేతను, నివాసముచేతను పావనమైనది మట్టెవాడ (ఓరుగల్లులో నొక భాగము). లింగమూర్తిగారి యిల్లు తద్వంశీయుల కిప్పటికిని వాసయోగ్యమై తద్భక్తులచే గౌరవింపబడుచున్నది. ఈ పావనగృహమును ప్రభుత్వమువారును ప్రజలును మనదేశపు పుణ్యతీర్థములందొకటిగా భద్రపరుపవలసిన యగత్య మెంతేని కలదు. పరశురామపంతులవారి వంగడము లింగమూర్తి ఆదిగా ఆధ్యాత్మికవిద్యల కాలవాలమైనది. ఎన్నియో భక్తివేదాంతగ్రంథములా వంశీయులచే వ్రాయబడినవి.[2] లింగమూర్తి రామమంత్రితిమ్మమాంబల కుమారుడు. అతని జీవితవిశేషములు కవిచరిత్రముల కెక్కియుండుటచే వాని గూర్చి వ్రాయనక్కరలేదు. ప్రస్తుతను ఆత్మారామ గోవిందశతకములను పరిచయము చేయుటే నా కర్తవ్యము.

ఈ రెండు శతకములును, మరికొన్ని పంచరత్నములును రెండు వేత్తెల పొడవుగల ౩౪ తాటియాకులపై వ్రాయబడి ఉస్మానియావిశ్వవిద్యాలయము సంస్కృత అకాడమిలో (నెం. 481) భద్రముగా నున్నది.

---

1. చూడుడు: తెలుగు జానపదగేయ సాహిత్యము. 1958, పుటలు 389-392

2. చూడుడు: "సాహితి" మాసపత్రిక, ఏలూరు, సంపుటము 1 సంచిక 3 జనవరి 1962 ఆంధ్రుల సంస్కృత సాహిత్యసేవ. పుటలు 13-17

ఆత్మారామశతకము ౧-౧౫ కమ్మలమీదను, గోవిందశతకము ౧౫-౨౯ కమ్మలపైనను, పంచరత్నములు వేరుగా ౫ కమ్మలమీదను వ్రాయబడి యున్నవి.

ఆత్మారామశతకమున మొత్తము ౧౦౬ కందపద్యములున్నవి. 100 పద్యముల తరువాత "శ్రీరామార్పణమస్తు" అని ముగించి తక్కిన ఆరు పద్యములలో గురుస్తుతి, కృతి ప్రశంస, ఫలశ్రుతి మున్నగునవి చెప్పబడినవి. ఈ శతకమున ప్రతిపాద్యమైన వేదాంతవిషయములును, శైలియు దెలియుటకునై స్థాలీపులాకన్యాయముగా అట నట కొన్ని పద్యము లుదాహరింతును.

క॥ నరనారాయణు(ల)ము మన
మిరువురము నవిద్యవలన నేకాత్ముల మ
క్షరపురుషపరమపురుషుల
మరయంగా విద్యవలన నాత్మారామా (2)

క॥ నిను గనియెదనను వాంఛన్
మనదేహేంద్రియమనముల కద ద్రోచిన యం
తన నీవే నేనైతిని
యనుభవమిది యతివిచిత్ర మాత్మారామా. (8)

క॥ నిమ్నోన్నతములు గాని సు
షుమ్నామార్గమున నిన్ను జూచి జితప్ర
ద్యుమ్నులగు యోగిపుంగవు
లామ్నాయవిధిం దలంతు రాత్మారామా. (40)

క॥ శ్రద్ధారక్తులు మొదలగు
బుద్ధివికారములు నన్ను బొందునె నేనా
బుద్ధ విశుద్ధ సమిద్ధమ
హృద్భాసకుడనగుట నాత్మారామా. (61)

క॥ జపములు తపములు వ్రతములు
చపలమనోనియమములు విచారింపగ నె
ల్లపు డమనస్కుడనగు నా
కపరారోపణములేల ఆత్మారామా. (84)

క॥ నానా దేశములందును
నానాకాలములయందు నానాయుగముల్
నేనై వెలుగుదుగాన స
దానందాత్మకుడ కేవలాత్మారామా. (100)

క॥ గురుడనగా నీశ్వరుడగు
స్థిరమతి నిష్యందసంగ జీవాత్ముం డ
య్యిరువుర కైక్యస్థానం
బరయంగా బరమపదము నాత్మారామా. (101)

క॥ అని యివ్విధమున నామది
ననిశము విలసిల్లు శ్రీమహాదేవగురుం
డనఘుడు (?) నీకిచ్చును నా
యనుభవ మెరిగించితిన్ మహాత్మారామా. (108)

క॥ ఇల పరశురామపంతుల
కులజ శ్రీ లింగమూర్తి గురుడవు నీవై
పలికితివి గాక నిరతుల
కలవరునే యిట్లు బలుక నాత్మారామా. (106)

ఈ శతకాంతమున వ్రాయసకాడు తన్నుగూర్చియు తిథివారాదులగూర్చియు నీ విధముగా వ్రాసియున్నాడు.

"కాళయుక్తి నామ సంవత్సర వైశాఖ శు॥ ౧౨ శుక్రవారం అయిదు గడియల ప్రొద్దు యెక్కేవరకు రామాతమంత్రయ, మామిళ్ళపల్లి వెంకటరాముడు, మా యింట్లో దక్షిణపు అరుగుమీద కూర్చుండగాను బ్రహ్మానంద స్వరూపులైన పరశురామపంతుల లింగమూర్తి అయ్యవార్లగారి పుస్తకంలో చూచి సత్యా నరసంభట్లు వ్రాశినాడు."

వ్రాయసకాడు కోర్టులో స్థిరపడిన దేశకాలములను సాక్షులను రుజువు పరచినట్లుగా నింత వివరముగా వ్రాయుట కొంత వింతగానే యున్నది. వ్రాయసకాడిచ్చిన తిథివారములు క్రీ. శ. 27-4-1798 నాటికి సరిపోవు చున్నవి.

పదునైదవ కమ్మ రెండవవైపున 'గోవిందశతకము' ప్రారంభమైనది. ఈ శతకమున మొత్తము 111 పద్యములున్నవి. ఇందులో కూడ 100 పద్య

ముల తరువాత 'శ్రీరామా' అని ముగించి తక్కిన 11 పద్యములు వ్రాయబడినవి. ఆత్మారాము శతకమంతయు వేదాంతవిషయములతో నిండియున్నది. కాని గోవిందశతకమున భక్తివేదాంతములు రెండును ప్రతిపాద్యములు. గుణకీర్తనము గల పద్యముల సంఖ్య గోవిందశతకమున నధికము. దీనినుండి కూడ మచ్చుకుగా కొన్ని పద్యము లుట్టంకింతును.

క॥ శ్రీ లక్ష్మీనారాయణ
నీలాంబుదనిభశరీర నిగమాధారా
లీలావిహార నిర్మల
శీల చిదానందకంద శ్రీగోవిందా. (1)

క॥ యోగధర యోగవిద్వర
యోగాభ్యాసప్రవీణ యోగాధారా
యోగైశ్వర్యపరాయణ
యోగానందానుభూతియుత గోవిందా (13)

క॥ పరతత్త్వము నంతక న
పరపురుషుని మించి సర్వసాక్షి యనంగా
పురుషోత్తముడని తెలిసిన
పరమాత్ముని నిను భజింతు పరగోవిందా. (48)

క॥ జ్ఞానికి మిక్కిలి ప్రియుడను
నే నతడును నాకు ప్రియుడు నిక్కముగా నా
జ్ఞానియె నేనని మును మీ
రానతి యిచ్చితిరి కాదె హరి గోవిందా. (61)

ఈ శతకమున 88 వ పద్యమునుండి వివిధావతారముల స్తోత్ర మున్నది. పరశురామావతార స్తోత్ర మిట్లున్నది.

క॥ ధరణీసురవరద మహా
పరశుధర నృపాలజలధిబడబానల ధా
సురసురతపోధన ఘనసుం
దర భార్గవరామ రూపధర గోవిందా (88)

లింగమూర్తి తనకృతిని గూర్చి చెప్పిన పద్యమిట్లున్నది.

క॥ ఈ స్తోత్ర రత్నరాజము
కౌస్తుభమణితుల్యముగను గని కానుకగా
హస్తాబ్జంబుల గైకొని
విస్తరముగ మై ధరింపవే గోవిందా. (10౪)

కవి తనను గూర్చి ఈ విధముగా వ్రాసికొన్నారు.

క॥ ఇల పరశురామ పంతుల
కులజ శ్రీ లింగమూర్తి గురుమూర్తి నము
జ్వల గోవింద స్తోత్రము
నలలితమతి జేసె సిద్ధ శతకము చేతన్. (111)

ఈ పద్యము తరువాత "శ్రీ సీతారామ పరబ్రహ్మణే నమః, శ్రీ లింగమూర్తి పరబ్రహ్మణే నమః" అని ముగించి వ్రాయసకాడు తానొక పద్యమును వ్రాసినట్లున్నాడు.

క॥ దయ నాదరింపు భక్తహ్స
దయ నాఫణిశయన వికసితాంబుజనయనా
నయనామయ నామయ నా
భయనాశము చేసి మమ్ము పాలింపు హరీ.

దీని తరువాత వ్రాయసకాడు నక్కా నరసంభట్లు తిథివారాదుల గూర్చి యిచ్చిన సాక్ష్యం మీదిరుగా నున్నది.

"కాలయుక్తి సంవత్సర వైశాఖ శు॥ ౧౩ నృసింహజయంతినాడు నక్కా నరసంభట్లు జాపాలకు జానకిరాముడు భోజనానికి పిలిస్తే ఆ పూటకి పోయి గంపావారింట కూర్చుండి తూర్పు ముఖాన కూర్చుండి నక్కా నరసంభట్లు వ్రాసినాను" ఇందు పేర్కొనబడిన తిథి మున్నగునవి క్రీ. శ. 28–4–17౪౮ నాటికి సరిపోవుచున్నవి. జాపాల ఓరుగల్లుకు సమీపమందున్న యొక గ్రామము. గంపావారు కోమటులై యుందురు. ఆ యింటి పేరుగల కోమట్లు మాయూర నున్నారు.

ఇంతటితో నీ రెండు శతకములు ముగిసినవి. ఈ తాళపత్రగ్రంథము రెండవ వైపునుండి పంచరత్నము లారంభమైనవి. ఇవి అరుకమ్మలపై నున్నవి. మొదటి పంచరత్నములు సీసపద్యములు. పంచరత్నములని

వ్రాయబడియున్నను ఈ సీసపద్యము లారున్నవి. ఈ యారు సీసపద్యముల కును మకుటముగానున్న ఎత్తుగీతి యొకటే. సీసపద్యములందు మొదటిది

సీ॥ మొదలు ప్రాణాపానములను త్రిరేచకపూరకకుంభకంబులను నవి మె
లంగు నిడాపింగళాసుషుమ్నల హంసతత్వంబునే సొ॥ తానె తెలియు
వికచహృత్కమలకర్ణికయందు ఘోషించు ప్రణవనాదంబునే ప్రభువుదెరుగు
భ్రూమధ్యమమును చూపులను నానావిధకళలను మనము నేఘనుడుగాంచు

నతడె ప్రత్యగాత్మ యతడెపో పరమాత్మ
యతడె వాసుదేవు డతడె శివుడు
అతడె స్వప్రకాశుడైన శ్రీ మన్మహా
దేవ లింగమూర్తి దివ్యకీర్తి.

ఇట్టి నాలుగు సీసపద్యముల తరువాత ఐదవ సీసపద్యమునకు సాంఖ్య మనియు, ఆరవ సీసపద్యమునకు అమనస్కమనియు శీర్షకములున్నవి.

ఈ పద్యముల తరువాత "శ్రీరామ రామ రామేతి రమే రామే మనో రమే" ఇత్యాదిగా గల్గు పంచరత్న శ్లోకములున్నవి. అటు తరువాత నీ శ్లోక ముల కాంధ్రానువాదములగు పంచరత్నములు గీత పద్యములున్నవి. వానిలో మొదటి పద్యము.

"శ్రీ మనోరమ శ్రీ రామ రామ రామ
యనుచు రమియించు రాముని యందు రామ
నామము వరానన సహస్రనామ తుల్య
మట్లుగావున దీని నీ వపఠింపు".

ఈ సీస పద్యములును, గీతపద్యానువాదములును పరశురామపంతుల లింగ మూర్తిగారి రచనములై యుండును. వ్రాయసకాడీ పద్యముల తరువాతకూడ తిథివారాదుల నిచ్చియున్నాడు.

"కాలయుక్తి నామసంవత్సర వైశాఖ శు॥ ౧౫ ఆదివారం నాడు బ్రహ్మ నందస్వరూపులైన పరశురామపంతుల లింగన్న అయ్యవార్లగారి ప్రతిలో వున్న క్రమాన నక్కా నరసంభట్లు వ్రాసినాడు. క్షమ అపరాధం, రెండు ఝాముల అప్పుడు మల్లెసాలలో మొగరానికి వొరిగి ఉత్తరముఖాసను కూర్చుండి వ్రాసినాను." ఈ తిథివారాదులు. క్రీ. శ. 29-4-1798 నాటికి సరిపోయినవి.

మరచిపోయిన "మల్లెసాల," "మొగరము" వంటి పల్లెటూరి మాటలు పట్టణవాసపు డ్రాయింగు రూములో పిల్లలకు చేరువగా కూర్చుండి వ్రాయుట కలవాటుపడిన నాకు మనస్సు కలుక్కు మనిపించినవి. వ్రాయన కాడిచ్చిన తిథివారాదుల ననుసరించి ఈ తాళపత్రగ్రంథము మన 'స్రవంతి' పుట్టిన ఏప్రిల్ మాసములోనే నూటయరువది నాలుగేండ్లకు పూర్వము వరుసగా మూడు దినములలో వ్రాయబడినట్లు తెలుచున్నది.

ఈ సక్కానరసంభట్లు సాక్షాత్తుగా లింగమూర్తిగారు వ్రాసిన మాతృక నుండి ఎత్తి వ్రాసినారు. ఈతడు లింగమూర్తిగారి శిష్యకోటిలోని వాడై యుండును. క్రీ. శ. 1798 నాటికా మహాయోగి సజీవుడై యుండును. లింగమూర్తిగారిని సేవించి తాను ధన్యుడై లింగమూర్తిగారి ఈ శతకములకు ప్రతిని వ్రాసి ఈ నాటికి మనకు దక్కించి మన కృతజ్ఞతలకు పాత్రులైన ఈ సక్కానరసంభట్లు కుటుంబమువారిప్పు డెచ్చటనైన కలరో లేరో తెలియదు..

(స్రవంతి, ఏప్రిల్ 1962)

# పాల్కురికి సోమనాథుని
# పండితారాధ్యోదాహరణము

మహాపండితుఁడును మహాకవియునునగు పాల్కురికి సోమనాథుడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, సోమనాథభాష్యము, రుద్రభాష్యము మున్నగు బృహద్గ్రంథములేకాక పెక్కు లఘుకృతులు రచించినాడు. ఆలఘు కృతులలోఁ గొన్నింటిని శ్రీ బండారు తమ్మయ్య గారొక సంపుటమున నిటీవల ప్రకటించియున్నారు. పిడుపర్తి సోమనాథుఁడు, పాల్కురికి సోమనాథుఁడు "ఉదాహరణ యుగ్మము" రచించినట్లు పేర్కొన్నాఁడు. సోమనాథుని బసవోదాహరణము తెలుగులోను సంస్కృతములోను లభించుటవలన ఇన్నాళ్ళు పండితలోకము ఉదాహరణయుగ్మ మనగా బసవోదాహరణయుగ్మమనియే భావించినది. కరీమునగరము మండలమున నాకొక తాళపత్రగ్రంథము లభించినది. దానిలో సోమనాథభాష్యముతోపాటు పాల్కురికి సోమనాథుడు రచించిన పెక్కులఘుకృతులున్నవి. వానిలో నీ పండితారాధ్యోదాహరణ మొకటి. ఇట్టిది యున్నట్లు ఇంతవరకు ఆంధ్రసాహిత్య ప్రపంచమునకు దెలియదు. తమ్మయ్యగారి సంపుటములో నిది చేరలేదు. మొదటిసారిగా దీనిని ప్రకటించుభాగ్యము కలిగినందుకు మిక్కిలి సంతోషించుచున్నాను. వ్రాయసకాఁడు తాళపత్రగ్రంథము వ్రాసికొన్నది నందన సంవత్సర వైశాఖ బహుళ త్రయోదశీ శుక్రవారము. ఇది క్రీ శ. ౪-౬-౧౮౩౨ తేదికి సరిపోవుచున్నది. ఇతరాంధ్ర ప్రాంతములందువలెఁ దెలంగాణమునఁ దాళపత్రగ్రంథములను సేకరించుట శ్రద్ధవహించుట జరుగలేదు. ప్రభుత్వమువారేమాత్ర మీవిషయమున శ్రద్ధగైకొనలేదు. చిన్నచిన్న సంస్థలవద్ద కొందఱు వ్యక్తులవద్ద కొన్ని తాళపత్రగ్రంథము లున్నవి. ఏయే మారుమూలలం దింకనెట్టి యనర్ఘరత్నములు మాటుమణఁగి యున్నవో తెలియదు. ఇరుగు పొరుగు రాష్ట్రములందు ప్రాచ్య పరిశోధనాలయములున్నవి. వేలకొలది తాళపత్రము లిప్పటికిని తెలంగాణ

మున లభించును. వాని నన్నింటిని ప్రోగుచేసి ఆంధ్రదేశ ప్రభుత్వము వారును మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము వంటిదాని నొకటి స్థాపించి పరిశోధనలు చేయించినఁ దెలుఁగు సూక్తులకును తెలుఁగు సాహిత్యమునకును మేలు చేసినవారగుదురు. అలక్ష్యము చేసినచో అతాళపత్త్ర గ్రంథము లెక్కడివక్కడ జీర్ణించిపోవును. అప్పుడు "నదీనాం సాగరో గతిః" అనిన యుదాహరణము చిత్తగింపుడు.

### శ్రీ మల్లికార్జున పండితోదాహరణము :

శ్లో. అద్వైతోద్ధత కుంభికుంభదళనోద్యద్దోర్దర్పంబాననో
గర్వోదంచిత పాంచరాత్ర నిబిడ ప్రాలేయ చండద్యుతిః,
పాషండాబ్దమహాగజో విజయతే బౌద్ధాద్రి ఘోరాశనిః
శ్రీమత్పండిత మల్లికార్జునగురు ర్వీరవ్రతాచార్యకః. ౧

శ్లో. పండితారాధ్యనామేతి పంచాక్షరసముద్భవమ్
సకృ[ద్] స్మరంతి యే భక్తా స్తేజనాః పుణ్యశాలినః. ౨

మాలిని. శివకర శివసౌఖ్యా శిష్టభక్తైకముఖ్యా
వివిధపరమశీలా వేదశాస్త్రానుపాలా
ప్రవిమలవరలీలా పండితారాధ్య దేవా
తవిలి మిము భజింతున్ దద్దయుం బ్రస్తుతింతున్. ౩

శా. శ్రీపర్వతవరమావరున్ 1వినమిత శ్రీ చెన్నమల్లేశ్వరున్
ధీమంతున్ నిగమాగమ ప్రథమసుశ్లోకార్థవేత్తన్ బుధ
స్తోమస్తుత్యుఁ బ్రభు సూర్యనేత్రు నగు నారాధ్యున్ పండితారాధ్యులన్
గామింతున్ సుతియింతుఁ గొల్తుఁ దలఁతున్ గామ్యార్థసంసిద్ధికిన్. ౪

—: ప్రథమా విభక్తి :—

శా. శ్రీమత్పండిత మల్లికార్జునుఁడు వైశిష్ట్యోల్లసద్విద్యుఁడు
ద్దామప్రోద్ధతవీరకేసరి నిత్యశ్లోకుఁ డుద్యన్మని
స్తోమస్తోత్రుఁడు గణ్యపుణ్యుఁ డతులాతోదారి సమ్యగ్దయా
ధాముం డీప్సిత మూల శక్తియుఁ బ్రసాదార్థక్రియాసక్తియున్. ౫

1. నియమిత.

మధురగతిరగడ

కళిక :— ²మఱి శుద్ధ శైవమార్గమందనుఁడు
యుఱవడించు భవ • దుర్గఖండనుఁడు
చిరతరప్రణవ • సిద్ధమాంత్రికుఁడు
పరమశక్తిపని • బద్ధతాంత్రికుఁడు
మునిగణ ప్రచయ • ముఖ్యవందితుఁడు
అనితరచిన్మయను • సౌఖ్యవందితుఁడు
అలఘునంచితశి • వైక్యభావనుఁడు
ఎలమి సర్వజగ • దేకపావనుఁడు

ఉత్కళిక :— తన విభుత్వమును
ఘనమహత్త్వమును;
ధరణి నింపుమని
హరుఁడు పంపఁబని
⁴వరని చెన్నమర
నొరలు గొన్న వర
సముదయాతనుఁడు
రమితయాతనుఁడు.

—: ద్వితీయా విభక్తి :—

శా. ఆర్యుండై ప్రమథానుసారకలితుండై వీరమాహేశ్వరా
చార్యుండై పరభక్తిముక్తిమహత్సౌఖ్యప్రదుండై మహై
శ్వర్యుండై భవరోగవైద్యుఁడయి ధాన్యమూర్తియై సద్గుణ
స్థైర్యుండై తను మల్లికార్జును యథాశక్తిన్ ప్రశంసించెదన్.

మధురగతిరగడ

కళిక :— మఱియును భువనన • మాన్యస్తుత్యుని
నెఱసిన మహిమా • న్వితపాండిత్యుని
అతిశయనుతబా • హ్యాంతరశుద్ధుని

2. మఱియు 3. ఏపిర 4. వరసెఁ

హరశివగణవర ♦ హరపూజనబోద్ధుని
శివయోగసుఖ ♦ శ్రీసాన్నిధ్యుని
సవిశేషాఖిల ♦ జగదారాధ్యుని
సంచిత విమల ♦ జ్ఞానసముద్రుని
సంచితసరస ♦ ర్మామృతరుద్రుని. ౯

ఉత్కళిక :— హరు సుపకరణము
లొరసిన చరణము
లలగక పెటికిన
యలుగుల నటికిన
మన మహదేవయ
మును కాళ్ళన్ దయఁ
బడసిన వీరుని
బరతా దూరుని. ౧౦

—: తృతీయా విభక్తి :—

౧. ఆజ్ఞారాధనపాత్రుచే విధినిషేధాదిక్రియాసీతుచే
నజ్ఞానాబ్ధివిహస్త్రుచేఁ బరమయోగానందుచే భక్తిన
మ్యజ్ఞానాశ్రయణీయుచే ననఘుచే మా పండితారాధ్యుచే
నాజ్ఞాసిద్ధియుఁ జిత్తశుద్ధియు నమర్త్యప్రీతిమైఁ బొందెదన్. ౧౧

ద్విరదగతి రగడ

కళిక:- మఱియు భవిజనరహిత ♦ మహితైకశీలుచే
సురుచిరారనగణో ♦ ద్యుక్తవాగ్జాలుచే
ప్రకటితాష్టాదశపు ♦ రాణనిర్ణేతచే
సకలశాస్త్రార్థవి ♦ జ్ఞానసంధాతచే
వేదాంతసిద్ధాంత ♦ విషయప్రవర్తిచే
నాదిమార్గప్రతిష్ఠా ♦ చార్యమూర్తిచే
శివతత్త్వభావనం ♦ చితయోగమధనుచే
శివతత్త్వసారసం ♦ చితపుణ్యకధనుచే.

---

౧. జన.

ఉత్కళిక :- గురునాథుఁ దలపోచి
యరసి ప్రభులను జూచి
శివు ప్రసాదము గొనిన
భవము మఱి లేదనిన
దని జగంబులఁ జాటి
మును ప్రసాదము నాటి
చేసిన ప్రసిద్ధుచే
నా శుభనముద్రుచే. ౧।

—: చతుర్థీ విభక్తి :—

౪. భక్తుం డీశ్వరుఁ డగ్రగణ్యుఁడు మహాభాగుండు తత్త్వార్థసం
యుక్తస్వాంతుఁడు దేశికోత్తముఁడు విద్యోల్లాసవంతుండు ప్ర
వ్యక్తుండంచు గుఱించి జంగమనముద్యద్భావభావార్చనా
సక్తిన్ వేడ్కను మల్లికార్జునునకై సద్భక్తి నాఁటించెదన్। ౧

ద్విరదగతి రగడ

కళిక :- మఱియును బునర్జనన । మరణదూరునకు నై
వెలయు నవగరళభయా । వరణ కరణునకు నై
గహనాంగనంగరవి । కారదూరునకు నై
సహజైకయోగప్ర । చారధీరునకు నై
కమనీయభక్తిశృం । గార పాత్రునకు నై
సముదితాంచితశివా । చారపూర్ణునకు నై
అతులసంవిత్ప్రభా । యత్తధిత్తునకు నై
అతివినిర్మలమహో । దాత్తవృత్తునకు నై ౧:

ఉత్కళిక :- లింగార్చనావేళ
జంగమము సల్లిలఁ
(గడువఱిని దనకడకు)
నెరతేర శివపూజ
గొనిరక్తుఁడే లింగ

మని భజించిన జంగ
మ్ముప్రౌఢపదునకై
విప్రసమ్మదునకై ౧౬

—: పంచమీ విభక్తి :—

శా. ఆఖ్యాతప్రముఖానుకీర్తి వలనన్ స్వాత్మానుబోధోల్లస
త్స్వా(ఖ్యోపా)యుణన్యపకారువలనన్ శంభుప్రసాదాగమ
[8]వ్యాఖ్యాతాచరణప్రవీణమతి భాస్వత్పండితారాధ్యనా
మాఖ్యాతాచితపుణ్యమూర్తివలనన్ మా కిష్టముల్ చేకురున్. ౧౭

ద్విరదగతి రగడ

కళిక:— మఱియు ననర్ఘశివన । మయసముచితునివలన
గురుఁ బొనరుచున్ దనరు । గుణగణాయతువలన
శరణగణవరచరణ । సరసిరుహపదువలన
సరస [7] వరమునినికర । నరతనుతయశువలన
పరమవరవిమలతర । వరమసుఖకరువలన
నిరతిశయదురితచయ । నిఖిలభయహరువలన
శ్రుతినియతమతసహిత । సురచిరసహితువలన
విరతయమనియమనను । విలసచ్చరితువలన ౧౮

ఉత్కళిక:— శివుని పంపున వచ్చి
దవిలి కనుగవ నిచ్చి
మమ్మాటికిని బరయ
నమ్మకున్నను దరయ
కెరల నిపురలగు కన్ను
లరరఁ బరసిన చెన్ను
నివుడు ధన్యునివలన
భువనమాన్యునివలన ౧౯

---

8. వ్యాఖ్యయా 7. శుక

## మధురగతి రగడ

కళిక :— మఱియును సజ్జన । మందరునందుఁ
గౌఱలు బ్రకటస్ఫూర్తి । కుందరునందుఁ
దురితసముత్కర । దూరగునందుఁ
పరమపరాత్పర । పారగునందుఁ
నరనతజగజ్జన । సన్నుతునందుఁ
ఉరుతరకీర్తన । మున్నతునందుఁ
పరిమితసూనృత । భాషణునందుఁ
స్ఫురితదయారస । భూషణునందుఁ ౨౪

ఉత్కళిక :— హరు కృపయాటల
కిరవగు చోటుల
కనువగు మాటల
వినుతుల తేటల
పరముల పాటల
మురవగు నాటల
గల గురునందు(న్)
మలహరునందు(న్) ౨౫

—: సంబోధన :—

శా. శాంతస్ఫూర్తిరసంధినాథ భవపాశచ్ఛేదనోగ్రాత్మ సి
ద్ధాంతప్రౌఢరవాదగీతమయవిద్యాభిత భృంగీశదు
ర్వ్యాంతోద్యద్భ్రుల వీరభద్ర నినునేఁ బ్రార్థింతు విజ్ఞాతవే
దాంతా। పండితమల్లికార్జున। త్రిలోకారాధ్య। రక్షిం[పుమా] ౨౬

## తురగవల్గన రగడ

కళిక :— మఱియు నంయమీశ్వరోక్త । మార్గనంతతప్రచార
మెఱయు హృదయకమలమధ్య । మిళితశుద్ధతత్వసార
దురితచరితజనసమరణ । దుఃఖనంకటాతిదూర
హరసమయసుధార్థపద్ధ । నాధికల్పితప్రచార

ప్రకటతరభవాంధకార । పటలవిఘటనప్రదీప
సుకృతజనహితోపదేశ । సులభసద్గురుస్వరూప
విస్మయాద్భుత జనన హేతు । వీరభక్తియోగసాంద్ర
అస్మదీయ చెన్నమల్లి । కార్జునాపరావతార ౨౮

ఉత్కళిక :— అమర తనువు సత్క్రియాద
రము ధనము గాని వేర
నము మనము భక్తిభావ
నమున సమయలింగసేవ
ధానలీన పరమయోగ
మానితానురాగభోగ
జనితనిర్వికల్పసౌఖ్య
వినుతనిఖిలశరణముఖ్య ౨౯

—: సార్వవిభక్తికము :—

శా. నీవారాధ్యుండవు నిన్నుతించుజగముల్ నీచే భవం బెందు నీ
కై వర్తిల్లు యశంబు నీవలన సౌఖ్యావాప్తి నీకుం బ్రసా
దావిస్ఫార నతోత్సవంబతరు నీయందావహింతున్ మదిన్
దేవా। పండితమల్లికార్జున। జగద్దీపప్రభావోదయా। ౩౦

శా. ఆరూఢాంచితలింగజంగమ కృపాయత్త ప్రసాదోదయా
హారోక్తిన్ అను నీయుదాహరణమున్ పాల్కురికి సోముండు లో
కారాధ్యుండగు మల్లికార్జునునకి ట్లర్పించె సద్భక్తి నిం
డారంగాఁ బఠియించినన్ వినినఁ గామ్యార్థం బిలన్ జేకుఱున్. ౩౧

(ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, డిసెంబరు 1965)

# వేముల రామభట్టు - గౌరీ విలాసము

మహబూబునగరము మండలమున మానాజీపేట (మానవతీపురము) అను చిన్న జమీందారీ పట్టణము కలదు. దానికి "తూము" ఇంటి పేరుగల రెడ్లు అధిపతులు. ఆ జమీందారు లెందరో కవిపండితుల నాశ్రయమిచ్చి సంస్కృతాంధ్ర వాఙ్మయములకు చక్కని దోహద మొనర్చిరి. కవి పండితులను పోషించుటేకాక తూము వంశపురెడ్లు తాము స్వయముగా కవులై పండితులై వాసికెక్కినారు. అట్టివారిలో తూము రామచంద్రావనిపాలు డొకడు. ఇతడు "అలమేలుమంగాపరిణయ" మను[1] కావ్యమును రచించెను. ఈ రామచంద్రావనీపాలుడు (రాజా చందూలాల్ సమకాలీనుడను ఆధారమును బట్టి) పందొమ్మిదవ శతాబ్దము ప్రథమపాదమున నుండినట్లు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు నిర్ణయించినారు. రాజా చందూలాల్ (క్రీ. శ. 1766-1845) అసఫ్జాహి వంశపు సుల్తానులలో మూడవవారైన సికిందర్‌జా కాలమునను, నాల్గవవారైన ఆసిఫుద్దౌలా కాలమునను ముఖ్యమంత్రిగా నుండినవారు.[2] తూము రామచంద్రావనీపాలుని కాలమును కనుగొనుట కితరాధారములు నాకు వేరేమియు లభించలేదు. ఈ రామచంద్రారెడ్డి కుమారుడు పరశురామరెడ్డి. పరశురామరెడ్డి ప్రాపునందు "గౌరీవిలాస" మను నాల్గాశ్వాసముల మహా ప్రబంధమును రచించినవాడు మన వేముల రామభట్టు. కనుక తూము రామచంద్రావనీపాలుని కుమారుడగు పరశురామరెడ్డియును, అతని ప్రాపకమును గాంచిన నీ కవివతంసుడగు వేముల రామభట్టును (రామాభట్టని వ్రాతప్రతి) ౧౯వ శతాబ్దపు మధ్యభాగము—అనగా నిప్పటికి నూరేండ్లకు పూర్వ ముండినవారని యూహింపవచ్చును.

---

1. ఈ కావ్యమును గ్రంథకర్తకు మునిమనుమడగు శ్రీ తూము రామకృష్ణారెడ్డిగారు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారిచే పరిష్కరింపించి ప్రకటించినారు, 1949.

2. Journal of Andhra Historical Reaserch Society 1961-62. Pages 90-100.

గౌరీవిలాసకావ్యము పూర్వకాలపు దళసరి కాగితములపై వ్రాయబడి హైదరాబాదు ఆంధ్ర సారస్వతపరిషత్తువారికడ నున్నది. ఇందులో మొదటి రెండు కాగితములు పోయినవి. వీనిలో ఇష్టదేవతా ప్రార్థనాదికములు, పూర్వకవి సంస్మరణము మున్నగు విషయములకు సంబంధించిన పద్యము లుండి యుండును. పోయిన కమ్మలు పోగా మూడవకమ్మ ఇట్లారంభమైనది.

'... ...దగిన మహాదేవ చారిత్రంబెయ్యది యని విచారించుచున్న సమయంబున'—

దీనితరువాత కృతికై ప్రోత్సహించిన పరశురామరెడ్డి వర్ణనము, అతని వంశావతారవర్ణనము మొదలైనవి కలవు. ఇందులో కొన్ని పద్యములు.

సీ॥ తననిశితాసి (...) వం బరాతికాంతాబృందములకును హృత్తాపమిడగ
దనదానమహిమ చింతారత్నసంతాన సురధేనువులతోడ సరసమాడ
తనయశోగరిమ సుధాధామహిమకుభృత్ క్షీరవారాసుల సిగ్గుపరప
తన రూపలావణ్యత వసంతరతికాంత నలరాజులను జూచి నగవుచుండ
బరగుచుము కులాబ్ధి శంబరధరుండు
భూరిమేధాకరుడు శివాచారపరుడు
సత్యసంకల్పు డతిధర్మ శాస్త్రములను
కోవిదుండు పరశురామ భూవిభుండు.

ఉ॥ సోమకులిత్పరాక్రముడు సంగర రంగధరాధిరాజగో
త్రామర రాజధర్మ నర్పకాయుధహస్తుడు దిక్పతిగణో
ద్దామ సుమల్లికాకుసుమదామ యశఃప్రకటోజ్వలుండు శ్రీ
రాముబవజ్జ్వలై పరశురామధరారమణీశు డొప్పెడిన్.

శా॥ శ్రీ లక్ష్మీనరసింహ మంత్రఫల సంసిద్ధి ప్రకాశుండు స
ద్భూయుండాశ్రిత చందనుండు విలసత్ క్షేపాల గోత్రాంబుధి
ప్రాలేయాంశు దు(ద్ర)తాపరిపుక్షిత్యాధుండు సత్కీర్తి ( . )
( . )లాయుక్తుడు రామచంద్రధరణీపాలాత్మజుం డొక్కెడన్.

సీ॥ ఒకచెంత (సకల) కళాప్రవీణుల లోకదిక్కు నిఖిలశాస్త్రకచయంబు
నొకచెంత సకలంక సుకవీంద్రనికరంబు లొ(కట) సిద్ధాంతజాతకవిధిజ్ఞ

సీ॥ అచలేశ్వరులుగాని యచలేశ్వరులుగారు భూరిదర్పోద్యద్విభూతిగతుల
గోపసింహులుగాని గోపసింహులుగారు చటులబాహాబల శౌర్యగతుల
నరబిడౌజులుగాని నరబిడౌజులుగారు వినతాశిజయదశావిభవగతుల
రాజాంగజులుగాని రాజాంగజులుగారు తగ కళారూపసౌందర్యగతుల

ననుచు జనులెన్నఁగను మిన్నయగు యశస్స్థి
తిని వహింప నవద్యయద్వీపభూప
మాన్యులగురురుగాక సామాన్యనృపులె
తూమువంశంబునను బుట్టు భూమిపతులు.

రామభట్టీవిధముగా తూమువంశమువారి నందరిని వర్ణించినాడు. ఈ వర్ణనము ననుసరించి తూమువారి వంశక్రమ మీ విధముగానున్నది.




ఈ వంశావతారమునకును అలవేలుమంగాపరిణయమం దీయబడిన వంశావతారమునకును కొలది వ్యత్యాసములున్నవి. అలవేలుమంగా పరిణయమున అయ్యపురెడ్డి కొడుకులందు జ్యేష్ఠుడుగా చెప్పబడిన వెంకటధాత్రీశ్వరు

ఇందు కనిష్ఠుడుగాను మరియు చినరామిరెడ్డి నంబమ్మల సంతానముగా చెప్పబడిన రామచంద్రావనీపాలు డిందు (పెద) రామిరెడ్డి నంబమ్మల సంతానముగను చెప్పబడినాడు. గౌరీవిలాసకృతి రచనమునకు ప్రోత్సహించిన పరశురామరెడ్డి రామచంద్రావనీపాలుని ఔరసపుత్రుడు కాడనియు దత్తపుత్రుడనియు గౌరీవిలాసము వలన దెలియనగుచున్నది.

కృతికర్త పరశురామరెడ్డిచే ననుజ్ఞాతుడై గృహమునకుబోయి ఆరాత్రి నిదురింపగా స్వప్నమున పరమేశ్వరుడు సాక్షాత్కరించి కావ్యమును తన కంకితముగా రచింపుమని యాదేశించును. ఆ పట్టున పరమశివుని వర్ణన మీ తీరుగా నున్నది.

సీ॥ వలనొప్పనెమ్మేన నలదిన పలుబూది గనుగొన చలువ చందనముగాగ
కుడిచెన తారంగవిడిచిన వల్ పాపగమి పైడితీవె జందెములుగాగ
జిమ్ముకవాల్ నాగబెత్తెము డమరుకము నుమ్మెనవాలు కైయాయుధములుగాగ
చలిమిరికొండ ముద్దులకూతు రెల్లప్పు దరమేన వరలని యతుకుగాగ
నొక్క తెలియాలతోలు బల్ ఆక్కినెక్కి
కనులపండువుగా నొద్ద గానలడుచు
తొలిమెయిళ్ళ రొదోయన రోచ లిలిచి
గట్టువిలుకాడు కలలోన నిట్టులనియె.

శివుని స్తోత్రముచేయు పద్యములును ఒక దండకమును గలవు. అటుపై కవి వంశావతారమిట్లుగలదు.

కోనయార్యుడు (కౌండిన్య గోత్రము)
(భార్య : కొండమాంబ)
|
రామయ్య
(భార్య : లక్ష్మమ్మ)
|

| | |
|---|---|
| పావన్న (భార్య : పెదవెంకమ్మ) | లక్ష్మీనృసింహుడు (భార్య : వెంకమ్మ) |
| | రామభట్టు (కృతికర్త) |

